# అథ అష్టవింశో%ధ్యాయః

## శంఖచూడుని వివాహము

సనత్కుమార ఉవాచ |

తతశ్చ శంఖచూడో%సౌ జైగీషవ్యోపదేశతః | తతశ్చకార సుప్రీత్యా బ్రహ్మణః పుష్కరే చిరమ్ || 1

గురుదత్తాం బ్రహ్మవిద్యాం జజాప నియతేంద్రియః | స ఏకాగ్రమనా భూత్వా కరణాని నిగృహ్య చ || 2

తపంతం పుష్కరే తం వై శంఖచూడం చ దానవమ్ | వరం దాతుం జగామాశు బ్రహ్మ లోకగురుర్విభుః || 3

వరం బ్రూహీతి ప్రోవాచ దానవేంద్రం విధిస్తదా | స దృష్ట్వా తం ననామాతి నమ్రస్తుష్టావ సద్గిరా || 4

వరం యయాచే బ్రహ్మణమజేయత్వం దివౌకసామ్ | తథేత్యాహ విధిస్తం వై సుప్రసన్నేన చేతసా || 5

శ్రీ కృష్ణకవచం దివ్యం జగన్మంగలం మంగలమ్ | దత్తవాన్ శంఖచూడాయ సర్వత్ర విజయప్రదమ్ || 6

బదరీం సంప్రయాహిం త్వం తులస్యా సహ తత్ర వై | వివాహం కురు తత్రైవ సా తపస్యతి కామతః || 7

సనత్కుమారుడిట్లు పలికెను-

అపుడా శంఖచూడుడు జైగీషవ్యమహర్షి ఉపదేశమును పొంది పుష్కరక్షేత్రమునందు చిరకాలము బ్రహ్మను ఉద్దేశించి పరమప్రీతితో తపస్సును చేసెను (1). ఆతడు ఇంద్రియములను నిగ్రహించి మనస్సును ఏకాగ్రము చేసి గురువుచే ఉపదేశింప బడిన బ్రహ్మ మంత్రమును జపించెను (2). లోకములకు తండ్రి, సర్వసమర్థుడు నగు బ్రహ్మ వెంటనే పుష్కరములో తపస్సు చేయుచున్న ఆ శంఖచూడాసురునకు వరము నిచ్చుటకై అచటకు

వెళ్లెను (3). అపుడు బ్రహ్మ ఆ రాక్షసవీరునితో 'వరమును కోరుకొనుము' అని పలికెను. ఆతడు బ్రహ్మను గాంచి మిక్కిలి వినయముతో ప్రణమిల్లి పవిత్రమగు వచనములతో స్తుతించెను (4). దేవతలచే జయింపబడకుండుట అను వరమును ఆతడు బ్రహ్మనుండి కోరగా, ఆయన మిక్కిలి ప్రసన్నమగు మనస్సుతో తథాస్తు అనెను (5). జగత్తులోని సర్వమంగళవస్తువులకంటే మంగళప్రదమైనది, సర్వదేశములలో మరియు సర్వకాలములలో విజయము నొసంగునది, దివ్యమైనది అగు శ్రీకృష్ణకవచమును ఆయన శంఖచూడునకు ఇచ్చెను (6). నీవు బదరికి వెళ్లి అచట తులసిని వివాహమాడుము. ఆమె అచటనే తన కోరికననుసరించి తపస్సును చేయుచున్నది (7).

ధర్మధ్వజ సుతా సేతి సందిదేశ చ తం విధిః | అంతర్ధానం జగామాశు పశ్యతస్తస్య తత్ క్షణాత్ || 8

తతస్స శంఖచూడో హి తపస్సిద్ధో%తి పుష్కరే | గలే బబంధ కవచం జగన్మంగల మంగలమ్ || 9

ఆజ్ఞయా బ్రహ్మణసో%పి తపస్సిద్ధ మనోరథః | సమాయ¸ౌ ప్రహృష్టాస్య స్తూర్ణం బదరికాశ్రమమ్ || 10

యదృచ్ఛయా%%గతస్తత్ర శంఖచూడశ్చ దానవః | తపశ్చరంతీ తులసీ యత్ర ధర్మధ్వజాత్మజా || 11

సురూపా సుస్మితా తన్వీ శుభభూషణా భూషితా | సకటాక్షం దదర్శాసౌ తమేవ పురుషం పరమ్ || 12

దృష్ట్వా తాం లలితాం రమ్యాం సుశీలాం సుందరీం సతీమ్ | ఉవాస తత్సమీపే తు మధురం తామువాచ సః || 13

'ఆమె ధర్మధ్వజుని కుమార్తె' అని బ్రహ్మ ఆతనికి బోధించి ఆతడు చూచు చుండగా వెంటనే అదృశ్యుడాయెను (8). పుష్కరములో తపస్సును చేసి గొప్ప సిద్ధిని పొందియున్న ఆ శంఖచూడుడు అపుడు జగత్తు మంగళములకు కూడ మంగళ##మైన కవచమును మెడలో కట్టుకొనెను (9). తపస్సుచే సిద్ధించిన మనోరథము గల ఆ

శంఖచూడుడు బ్రహ్మయొక్క ఆజ్ఞచే వెంటనే బదరికాశ్రమమును చేరెను. ఆతని ముఖములో ఆనందము తొణికిసలాడు చుండెను (10). ధర్మధ్వజుని కుమార్తెయగు తులసి తపస్సును చేయుచున్న స్థలమునకు శంఖచూడాసురుడు అనుకోకుండా వచ్చెను (11). మిక్కిలి అందమైనది, అందమగు చిరునవ్వు గలది, శుభకరమగు భూషణములను అలంకరించుకున్నది అగు ఆ యువతి ఆ మహాపురుషుని ప్రేమపూర్వకముగా పరికించెను (12). కోమలమగు దేహము గలది రమ్యమైనది, మంచి శీలము గలది, యగు ఆ యువతిని గాంచి ఆమెను సమీపించి ఆతడు ఆమెతో మధురముగా నిట్లనెను (13).

శంఖచూడ ఉవాచ |

కా త్వం కస్య సుతా త్వం హి కిం కరోషి స్థితాత్ర కిమ్ | మౌనీ భూతా కింకరం మాం సంభావితు మిహార్హసి || 14

శంఖచూడుడిట్లు పలికెను-

నీ వెవరు? ఎవని కుమార్తెవు ? ఇచ్చట ఉండి నీవేమి చేయుచున్నావు? నీవు మౌనముగా నుంటివేల? నన్ను నీ సేవకునిగా తలపోయుము (14).

సనత్కుమార ఉవాచ |

ఇత్యేవం వచనం శ్రుత్వా స కామం తమువాచ సా || 15

సనత్కుమారుడిట్లు పలికెను-

ఆతని ఈ మాటలను విని ఆమె ఆతనిని ఉద్దేశించి ప్రేమతో నిట్లనెను (15).

తులస్యువాచ |

ధర్మధ్వజసుతాహం చ తపస్యామి తపస్వినీ | తపోవనే చ తిష్ఠామి కస్త్వం గచ్ఛ యథాసుఖమ్ || 16

నారీ జాతిర్మోహినీ చ బ్రహ్మాదీనాం విషోపమా | నింద్యా దోషకరీ మాయా శృంఖలా హ్యనుశాయినామ్ || 17

తులసి ఇట్లనెను -

నేను ధర్మధ్వజుని కుమార్తెను. తపశ్శాలిని యగు నేను తపోవనములో నుండి తపస్సును చేయుచున్నాను. నీవెవరు? సుఖముగా వెళ్లుము (16). విషముతో పోల్చదగిన స్త్రీజాతి బ్రహ్మాదులనైననూ మోహింపజేయును. నిందార్హురాలు, దోషస్థానము, మోసగత్తె అగు స్త్రీ సాధకులకు సంకెల (17).

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్త్వా తులసీ తం చ సరసం విరరామ హ | దృష్ట్వా తాం సస్మితాం సోఽపి ప్రవక్తుముపచక్రమే || 18

సనత్కుమారుడిట్లు పలికెను-

తులసి ఆతనితో ప్రేమపూర్వకముగా ఇట్లు పలికి విరమించెను. ఆతడు చిరునవ్వుతో గూడియున్న ఆమెను గాంచి ఇట్లు చెప్పుటకు ఉపక్రమించెను (18).

శంఖచూడ ఉవాచ |

త్వయా యత్కథితం దేవి న చ సర్వమలీకకమ్ | కించిత్సత్యమలీకం చ కించిన్మత్తో నిశామయ || 19

పతివ్రతాస్స్త్రి యో యాశ్చ తాసాం మధ్యే త్వమగ్రణీః | న చాహం పాపదృక్కామీ తథా త్వం నేతి ధీర్మమ || 20

ఆగచ్ఛామి త్వత్సమీప మాజ్ఞయా బ్రహ్మణోఽధునా | గాంధర్వేణ వివాహేన త్వాం గ్రహీష్యామి శోభ##నే || 21

శంఖచూడోఽహమేవాస్మి దేవవిద్రావకారకః | మాం న జానాసి కిం భ##ద్రే న శ్రుతోఽహం కదాచన || 22

దనువంశ్యో విశేషేణ దంభపుత్రశ్చ దానవః | సుదామా నామ గోపోऽహం పార్షదశ్చ హరేః పురా || 23

అధునా దానవేంద్రోऽహం రాధికాయాశ్చ శాపతః | జాతిస్మరోऽహం జానామి సర్వం కృష్ణ ప్రభావతః || 24

శంఖచూడుడు ఇట్లు పలికెను -

ఓ దేవీ! నీవు చెప్పిన సర్వము అసత్యము కాదు. కాని కొంత సత్యము, కొంత అసత్యము గలదు. నా మాటను వినుము (19). పతివ్రతాస్త్రీలలో నీవు అగ్రేసరురాలవు. నేను పాపదృష్టిగల కాముకుడును గాను. నీవు కూడ అట్టి దానవు కాదని నేను భావించుచున్నాను (20). ఇపుడు నేను బ్రహ్మ యొక్క ఆజ్ఞచే నీవద్దకు వచ్చియుంటిని. ఓ సుందరీ! నేను నిన్ను గాంధర్వవిధిలో వివాహమాడెదను (21). దేవతలు పారిపోవునట్లు చేయు శంఖచూడుడను నేను. ఓ మంగళస్వరూపురాలా! నన్ను ఎరుంగనా ! ఎప్పుడైననూ నా పేరు వినలేదా? (22). విశేషించి నేను దనువంశములో జన్మించితిని. నా తండ్రి పేరు దంభుడు. పూర్వజన్మలో నేను శ్రీకృష్ణుని అనుంగు సహచరుడైన సుదాముడనే గోపాలకుడను (23) రాధాదేవియొక్క శాపముచే ఈ జన్మలో దానవవీరుడనై జన్మించితిని. శ్రీకృష్ణుని ప్రభావముచే నేను పూర్వ జన్మ వృత్తాంతమునంతనూ ఎరుంగుదును (24).

సనత్కుమార ఉవాచ |

ఏవముక్త్వా శంఖచూడో విరరామ చ తత్పురః | దానవేంద్రేణ సేత్యుక్తా వచనం సత్యమాదరాత్ ||

సస్మితం తులసీ తుష్టా ప్రవక్తు ముపచక్రమే || 25

సనత్కుమారుడిట్లు పలికెను -

శంఖచూడుడు ఆమె ఎదుట ఇట్లు పలికి విరమించెను. ఆ రాక్షసరాజు ఇట్లు ఆదరముతో సత్యవచనమును పలుకగా, ఆ తులసి సంతసించి చిరునవ్వుతో ఇట్లు చెప్పుట మొదలిడెను

(25).

తులస్యువాచ |

త్వయాహమధునా సత్త్వవిచారేణ పరాజితా | స ధన్యః పురుషో లోకే న స్త్రియా యః పరాజితః || 26

సత్క్రియోऽప్యశుచిర్నిత్యం స పుమాన్యస్త్రి యాజితః | నిందంతి పితరో దేవా మానవాస్సకలాశ్చ తమ్ || 27

శుధ్యేద్విప్రో దశాహేన జాతకే మృతసూతకే | క్షత్రియో ద్వాదశ##హేన వైశ్యః పంచదశాహతః || 28

శూద్రో మాసేన శుధ్యేత్తు హీతి వేదానుశాసనమ్ | న శుచిస్త్రీ జితః క్వాపి చితాదాహం వినా పుమాన్ || 29

న గృహ్ణంతీచ్ఛయా తస్మాత్పితరః పిండతర్పణమ్ | న గృహ్ణంతి సురాస్తేన దత్తం పుష్పఫలాదికమ్ || 30

తస్య కిం జ్ఞాన సుతపోజప హెూమ ప్రపూజనైః | విద్యయా దానతః కిం వా స్త్రీభిర్యస్య మనో హృతమ్ || 31

విద్యాప్రభావజ్ఞానార్థం మయా త్వం చ పరీక్షితః | కృత్వా కాంతపరీక్షాం వై వృణుయాత్కామినీ వరమ్ || 32

తులసి ఇట్లు పలికెను -

సాత్త్వికమనో భావములు గల నీచే నేను ఈ నాడు జయింపబడితిని. ఏ పురుషుడు ఈ లోకములో స్త్రీచే జయింపబడడో, వాడే ధన్యుడు (26). ఏ పురుషుడు స్త్రీచే జయింపబడునో వాడు పవిత్రమగు కర్మలను చేయు వాడే అయిననూ సర్వదా శౌచవిహీనుడే. పితృదేవతలు, దేవతలు, మరియు సర్వమానవులు అట్టి వానిని నిందించెదరు (27). జాతశౌచ మృతాశౌచ ములలో బ్రాహ్మణుడు పది, క్షత్రియుడు పన్నెండు, వైశ్యుడు పదిహేను, శూద్రుడు ముప్పది రోజులలో శుద్ధిని పొందునని వేదము ఉపదేశించుచున్నది. కాని స్త్రీచే

జయింపబడిన పురుషుడు చితిపై దహించుటచే తప్ప ఎక్కడైననూ శుద్ధిని పొందడు (28, 29). కావున అట్టి వాడు సమర్పించిన పిండమును, తర్పణములను పితృదేవతలు ఆనందముతో స్వీకరించరు. ఆతడు సమర్పించిన పుష్పఫలాదులను దేవతలు స్వీకరించరు (30). ఎవని మనస్సు స్త్రీలచే అపహరింపబడినదో, వానికి జ్ఞానము, మంచి తపస్సు, జపము, హోమము, పూజ విద్య, దానము అను వాటితో ఏమి ప్రయోజనము గలదు? (31) నీవిద్యను, ప్రభావమును, జ్ఞానమును తెలియుటకై నేను పరీక్ష చేసితిని. స్త్రీ వరుని పరీక్షించిన తరువాతనే భర్తగా వరించవలెను గదా! (32)

సనత్కుమార ఉవాచ |

ఇత్యేవం ప్రవదంత్యా తు తులస్యాం తత్క్షణ    విధిః |
తత్రాజగామ సంస్రష్టా ప్రోవాచ వచనం తతః || 33

సనత్కుమారుడిట్లు పలికెను-

తులసి ఇట్లు మాటలాడు చుండగా, అదే క్షణములో సృష్టికర్తయగు బ్రహ్మ అచటకు విచ్చేసెను. అపుడాయన ఇట్లు పలికెను (33).

బ్రహ్మోవాచ |

కిం కరోషి శంఖచూడ సంవాదమనయా సహ | గాంధర్వేణ
వివాహేన త్వమస్యా గ్రహణం కురు || 34

త్వం వై పురుషరత్నం చ స్త్రీ రత్నం చ త్వియం సతీ | విదగ్ధాయా
విదగ్ధేన సంగమో గుణవాన్ భ##వేత్ || 35

నిర్విరోధం సుఖం రాజన్ కో వా త్యజతి దుర్లభమ్ |
యో%విరోధసుఖత్యాగీ స పశుర్నాత్ర సంశయః || 36

కిం త్వం పరీక్షసే కాంత మీదృశం గుణినం సతి |
దేవానామసురాణాం చ దానవానాం విమర్దకమ్ || 37

అనేన సార్ధం సుచిరం విహారం కురు సర్వదా | స్థానే స్థానే యథేచ్ఛం చ సర్వలోకేషు సుందరి || 38

అంతే ప్రాప్స్యతి గోలోకే శ్రీ కృష్ణం పునరేవ సః | చతుర్భుజం చవైకుంఠే మృతే తస్మింస్త్వమాప్స్యసి || 39

బ్రహ్మ ఇట్లు పలికెను -

ఓ శంఖచూడా! ఈ మెతో నీవేమి సంభాషణను చేయుచున్నావు? ఈమెను నీవు గాంధర్వవిధిచే వివాహమాడుము (34). నీవు పురుషులలో శ్రేష్ఠుడవు. ఈ పతివ్రత స్త్రీలలో శ్రేష్ఠురాలు. జ్ఞానవంతురాలగు ఈమెకు జ్ఞానివగు నీతో వివాహము గొప్ప గుణకారి కాగలదు (35). విరోధము లేనిది, దుర్లభ##మైనది అగు సుఖమును ఎవడు విడిచిపెట్టును? ఓ రాజా! విరోధములేని సుఖమును పరిత్యజించు వ్యక్తి పశుప్రాయుడనుటలో సందేహము లేదు (36). ఓ పుణ్యాత్మురాలా! గుణవంతుడు, దేవతలను, అసురులను దానవులను శిక్షించువాడు అగు ఇట్టి సుందరుని నీవు ఏమి పరీక్ష చేయుచున్నావు ? (37) నీవీతనితో గూడి చిరకాలము అన్ని వేళలలో సర్వలోకములయందలి ప్రదేశములన్నింటిలో యథేచ్ఛగా విహరించుము. ఓ సుందరీ! (38) ఆతడు మరణించిన తరువాత గోలోకములో మరల శ్రీకృష్ణుని పొందగలడు. ఆతడు మరణించిన పిదప నీవు వైకుంఠములో చతుర్భుజుడగు విష్ణువును పొందగలవు (39).

సనత్కుమార ఉవాచ |

ఇత్యేవమాశిషం దత్త్వా స్వాలయం తు య¸° విధిః | గాంధర్వేణ వివాహేన జగృహే తాం చ దానవః || 40

ఏవం వివాహ్య తులసీం పితుస్థ్సానం జగామ హ | స రేమే రమ్యయా సార్ధం వాసగేహే మనోరమే || 41

ఇతి శ్రీశివమహాపురాణ రుద్రసంహితాయాం యుద్ధఖండే శంఖచూడ వివాహవర్ణనం నామ అష్టవింశో%ధ్యాయః. (28)

సనత్కుమారుడిట్లు పలికెను-

బ్రహ్మ ఈ విధముగా ఆశీర్వదించి తన ధామమునకు వెళ్లెను. ఆ శంఖచూడుడు ఆమెను గాంధర్వవిధితో వివాహమాడెను (40). ఆతడు ఈ తీరున తులసిని వివాహమాడి తండ్రి గృహమునకు వెళ్లి మనోహరమగు ఆ నివాసములో ఆ సుందరితో గూడి రమించెను (41).

శ్రీ శివమహాపురాణములోని రుద్రసంహితయందు యుద్ధఖండలో శంఖచూడ వివాహవర్ణనమనే ఇరువది ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (28).